

# ఒక నాస్తికుడి నామా

## గౌరవ్

ప్రజా ప్రచురణలు, పిఠాపురం

# ఒక నాస్తికుడి నామా !



## గౌరవ్

" ప్రజ సకల భౌతిక విలువలనీ ఉత్పత్తి చేసే శక్తే కాదు, ప్రజలే అన్ని ఆధ్యాత్మిక విలువలకి తరగని ఆధారం. కాల, సౌందర్య, మేధా ప్రమాణాల రీత్యా తొలి తత్త్వవేత్త, కవీ ప్రజే. సర్వ మహాకావ్యాలకీ, ప్రపంచపు సకల విషాదాంత నాటకాలకీ, అన్నిటికంటే మహత్తరమైన ప్రపంచ సంస్కృతి, చరిత్రకీ కర్త ప్రజే. "

- మాక్సిమ్ గోర్కి

రష్యన్ మహా రచయిత

ప్రజా ప్రచురణలు

పిఠాపురం

# OKA NASTIKUDI NAMA

By

**Gourav**

On Behalf of :
Center for Anarchist Studies (C.A.S.)

Printed by :
Praja Publications

For Copies :
Mobile : 7396 899 399
9032 094 492

@-mail : gouravmeka@gmail.com
gouravmeka@yahoo.com

Price : 15 /-

**Is god willing to prevent evil, but not able? Then he is not omnipotent. Is he able, but not willing? Then he is malvolent. Is he both able and willing? Then whence cometh evil? Is he neither able nor willing? Then why call him god ?**

**Epicurus**
300 B.C.

దుష్టత్వాన్ని ఆపడం దేవుడివల్ల అవ్వడం లేదా ? అయితే అతడు సర్వ శక్తివంతుడు కాదు. లేక ఆపగలిగిఉండికూడా దుర్మార్గాన్ని ఆపాలనుకోవడం లేదా? అయితే అతడు ద్వేషపూరితమైనవాడవుతాడు. అలా కాక ఆపాలనే అభీష్టమూ ఉండి, ఆపగలిగే శక్తీ ఉన్నట్లయితే మరి దుష్టత్వం ఎక్కడి నుంచి వస్తోంది ? ఒక వేళ అతడికి ఆపగల శక్తీ, ఆపాలనే ఉద్దేశ్యం రెండూ లేవా ? అటువంటి వాడిని అసలు దేవుడని పిలవడం దేనికి ?

**ఎపిక్యూరస్**
**క్రీ॥ పూ॥ 300 సం॥**

If Oxen and Horses had hands and could draw with hands and Create representation like those made by men, the gods of Oxen would be like Oxen and Horses would draw pictures of gods like Horses and each spiecies would make its gods in accordance with the form each species possess.

**- Xenophanes**

540 B.C.

ఎద్దులకీ, గుర్రాలకీ కూడా చేతులుండీ, వాటిని వుపయోగించడం తెలిసుంటే అవి కూడా మానవుల్లాగానే తమకీ ఒక ప్రాతినిధ్య స్వరూపాన్ని సృజించుకునుండేవి. ఎద్దుల దేవుడు దానిలానే వృషభాకారుడిగానూ, గుర్రం దేవుడు వాటిలాగే అశ్వంరూపం లోనూ వుండి వుండేవారు. వాటిలాగానే అవి తమ దేవుడ్ని కూడా చిత్రించుండేవి. అటువంటప్పుడు ప్రతీ జీవజాతి కూడా తమ తమ దేవుళ్ళని తమ అస్తిత్వ ప్రమాణాలకి అనుగుణంగా, తమకిష్టమైన రూపంలో మలచుకోగలిగి వుండేవి.

- క్సినోఫనస్

క్రీ॥ పూ॥ 540 సం॥

## నా మాట !

సత్యానికి షార్ట్‌కట్‌లేవీ లేవు. అన్వేషించడమొకటే మార్గం. జ్ఞానానికి పక్కదారులేవీ పనికిరావు. తిన్నగా ఆలోచించడమొకటే శరణ్యం. మూర్ఖుకి మంతనాలేవీ ఉండవు. ప్రశ్నించుకుంటూ ప్రయత్నించడమొకటే ప్రమాణం. మానవ ప్రయత్నసారాన్ని జీర్ణించుకునే శాస్త్రం ఉద్భవిస్తుంది. జ్ఞానం దాని పరిధిని పెంచుకోవడానికి చేసే ప్రయత్నాల వలనే విజ్ఞానం విస్తరిస్తుంది. విజ్ఞానశాస్త్ర లక్ష్యం వ్యవస్థ శ్రేయస్సే. వివిధ పరదాల తెరల్ని తొలగించి వ్యక్తిని విశ్వనరుడిగా మలచడమే ఏ మానవతావాదాని కైనా మొట్టమొదటి మూల సూత్రం. సమాజాన్ని సర్వతోముఖాభివృద్ధి దిశగా నడిపించడమే ఎంతటి సిద్ధాంతానికైనా ఎదురయ్యే ధ్యేయం. అది మందిలో చేతనైనంత చైతన్యాన్ని పాదుకొల్పడం వల్ల మాత్రమే సాధ్యపడుతుంది.

సందేశం సత్యాన్వేషణకి నాంది. ఉత్పన్నమయ్యే ప్రశ్నల నివృత్తికి ప్రయత్నించడమే తాత్వికుడి ప్రధమ లక్షణం. అదే తత్వం. తత్వమంటే సత్యాన్ని తెలుసుకోవడానికి మనిషి చేసే శోధనే. మనిషి తనకి తెలిసినదాన్ని వినియోగించుకుంటూ దాని సహాయంతో తెలియని దాన్ని కనుగొనడానికి ప్రయత్నిస్తాడు. మానవ జీవన క్రమాన్ని మరింత సుఖవంతం, సౌకర్యవం తం చేసే సాధకాలకోసం నిరంతరం శ్రమిస్తూ ఉంటాడు. అటువంటి విప్లవాత్మకమైన వస్తు సాధనాలను ఆవిష్కరించడం కోసం శాస్త్ర సహాయంతో కృషి చేస్తూ ఉంటాడు. విజ్ఞానం మనిషికి వెన్నుదన్నుగా నిలుస్తుంది. అలా మనిషి సముపార్జించినది, సముపార్జించబోయేది కూడా భౌతిక అస్తిత్వంలో పాదార్థిక మార్పుల వల్లే సాధ్యపడుతుంది. అదే సత్యం.

మనిషి కనుగొన్నవాటి సహాయంతో కనుగొనబోయే విషయాలన్నీ ఆవిష్కరణ అనంతరం సత్యాలుగానే పరిగణించబడతాయి. మానవ విజ్ఞానశాస్త్ర సాధానాలని మరింత సుసంపన్నం చేసే అంశమే సత్యం. సత్యం అనేది ప్రాకృతిక సంబంధమైన విశ్వజనీన అంశమే తప్ప అలౌకికమో, అయోమయమో కాదు. అందుకే అంతిమ సత్యమనేదేదీ ఉండదు. సత్యమెప్పుడూ జ్ఞానంలాగానే పరిపూర్ణం కాదు. అవెప్పడూ అసంపూర్ణాలుగానే ఉంటాయి తప్ప సుసంపన్నం కావు. అంటే పరిణామమనేది ప్రాకృతిక నియమమన్నమాట. ప్రాకృతిక నియమాలకి విరుద్ధంగా ప్రపంచం నడవడం జరగదు. అలా కాకుండా సృష్టికి కర్త అనేవాడు ఉన్నాడనుకోవడం ఆస్తికత్వం.

ఆరంభంలో ఆస్తికత్వానికి అనాలోచనే కారణమయ్యింది. ఆదిమ మానవుడికి అతీత

విషయాల్ని గురించిన అజ్ఞానమే అలౌకిక ఆలోచనలకి ప్రేరణనిచ్చింది. ఏదో ఉందనే అహేతుక మైన ఊహని ఉద్బుదం చేసింది. అయితే ఆచరణాత్మకంగా ఆనాటి ఆస్తికత్వం వల్ల మనిషికొచ్చిన నష్టమేమీలేదు. అది ఎప్పడయితే మానవ సమాజ నిర్మాణంలో వ్యక్తుల వ్యవస్థీకృత ఆలోచనల సమూహంగా ఏర్పడిందో అప్పడు మతం రూపుదాల్చింది. మానవ చరిత్ర గతిలో అత్యంత అమానుష క్షణం బహుశా మతం ఆవిర్భవించిన కాలమేనేమో! అందుకే మొత్తం చరిత్రంతా తరచి చూస్తే మతం కంటే మానవుడ్ని నాశనం చేసిన ఏ ఇతర అంశమూ మతంలా కొట్టొచ్చినట్టు కనబడదు.

విజ్ఞత లోపించిన జ్ఞానం వ్యవస్థీకృతమవడానికి ప్రయత్నిస్తుంది. ప్రస్థానానికి నోచుకోని అస్థిత్వమే అజ్ఞానంగా పిలవబడుతుంది. సృష్టి కర్తనే అనాలోచన అలాటి అజ్ఞానానికి ఆరంభమయితే, మతమనే మౌఢ్యం ఆ అజ్ఞానానికి వంతపాడే అంధకార ఇంధనం. ఇన్నాళ్ళ గా అది జనాల్ని వెర్రివాళ్ళని చేస్తూనే ఉంది. ఈనాటికీ దాని అస్తిత్వం శక్తివంతంగానే ఉంది. అలాంటి అవాంఛనీయ అంశాలు నేటి నాగరిక మానవుడు అనుసరించడం శోచనీయ విషయం. అందుకు విరుద్ధంగా చెప్పకోదగ్గ ప్రయత్నాలు చరిత్రలో జరిగాయే కానీ సమకాలీనంగా సాధ్యపడడం లేదు. అందుకే ఈ చిరుప్రయత్నం. అంశమేదైనా అనాలోచితంగా అనుసరించడం వేరు. ఆలోచించి ఆచరించడం వేరు. మొదటిదాన్ని బానిసత్వమనీ, తర్వాతిదాన్ని మానవత్వమనీ అంటారు. మతం బానిసత్వానికి, సత్యం మానవత్వానికీ దారి తీస్తాయి. మీది ఏ మార్గమో నిర్ణయించుకుని ముందుకెళ్ళండి. కనీసం నిర్ణయించుకోడానికయినా వెళ్ళండి.

గౌరవ్
గౌహతి , అస్సాం,

# అంకితం

ఆలోచనాపరులందరికీ...

## ఆస్తికత్వం – నాస్తికత్వం !

అస్తి అంటే 'ఉన్నది' అనర్థం. అస్తిత్వంలో వున్నదానిని అంగీకరించే పదమిది. అయితే ఈ భౌతిక ప్రపంచానికి అతీతంగా దీనిని నడిపించే శక్తి లేదా వ్యక్తి వుందనో, వున్నాడనో భావించడమే ఆస్తికత్వం. నాస్తి అంటే 'లేదు' అనర్థం. మనం ఉంటున్న భౌతిక విశ్వానికి అతీతంగా ఏదీ లేదనీ, ఉన్నదంతా ప్రాకృతిక ప్రపంచంలో భాగమేనని చెప్పేది నాస్తికత్వం. ముందు భావమనేది జనించి తర్వాత భౌతిక పదార్థం వచ్చిందనేది భావ వాదం. ముందు పదార్థమే పుట్టింది, దాని ద్వారా భావోత్పత్తి సాధ్యపడిందనేది భౌతికవాదం. అంటే, ఆలోచనలోంచే అంతా పుట్టిందనేది ఆస్తికత్వమయితే, పదార్థం నుంచి మాత్రమే జీవం జన్మించిందనీ, ఆ తర్వాత మాత్రమే కొన్ని వేల సంవత్సరాల పరిణామం జరిగి మానవుడనే అపూర్వజీవావిర్భావం సంభవించిందనీ తదనంతరం మాత్రమే ఆలోచననేది రూపుదాల్చింద నేది నాస్తికత్వం. ఆస్తికత్వం అలౌకికత్వాన్ని ప్రస్తావిస్తుంది. అంటే ఈ లోకం కాకుండా మరో అదృశ్యలోకం అనేదుందని నమ్ముతుంది. నాస్తికత్వం ఇహలోకాన్ని మాత్రమే విశ్వసిస్తుంది. ఐహిక ప్రపంచానికి అతీతంగా ఇతర లోకమేదీ ఉండేందుకు అవకాశం లేదని ఆధారాలతో నిరూపిస్తుంది. ఆస్తికత్వపు అంతిమ రూపం మతంలా ఆవిర్భవించింది. మతం దృష్టిలో మనిషికి స్వాతంత్ర్యేచ్ఛే లేదు. దేవుడనే ఒక అగ్రాహ్య భావం మనిషిని తన ఆధీనంలో వుంచుకుంటుంది. నిజానికి ఆస్తికత్వం ఆరంభం నుంచీ అనాలోచన ప్రధానంగానే నడిచింది. అది మతమనే రూపాన్ని ఎప్పుడయితే సంతరించుకుందో అప్పడే శుద్ధమైన అహేతుత్వాన్ని (Irrationality) తనలో ఇముడ్చుకుంది. వ్యవస్థ సాంస్కృతిక సంబంధ అంశాలన్నింటినీ అదిలించడం ఆరంభించింది. కళ, రాజకీయం, సాహిత్యం, పరిపాలన తదితర అన్ని ప్రధాన రంగాలూ మత ప్రాతిపదికనే ఏర్పడ్డం జరిగింది. మతానికో దేవుడ్ని సృష్టించుకోవడం జరిగింది. దేవుడి పేరుతో, మతం పేరుతో అసంఖ్యాక మానవులు అంతం కావడం జరిగింది.

మతం పుట్టుకే అనాలోచితంగా జరిగింది. కాబట్టి దాని జీవితకాలం యావత్తూ అది మనిషిని అనాలోచనా పరుడిగా, అంటే ఆలోచించలేని పశువుగా ప్రతిష్ఠ చేయడానికే ఇష్టపడింది. స్వతంత్రంగా ఆలోచించే మనిషి అసలు మనిషే కాదని అది భోదించింది. మతం దృష్టిలో మనిషనేవాడొక అధముడు. దేవుడనే ఒక దేభ్యపు వ్యక్తి దయతో ఆ అలౌకిక భావం పై ఆధారపడి జీవిస్తున్నవాడు. దేవుడు తన ఇష్టానుసారంగా మనిషిని ఆడిస్తుంటాడు. అతడికి

కోపమొస్తే శిక్షిస్తాడు. సంతోషమొస్తే సుఖపెడ్తాడు. ద్వేషించేవారిని భక్షిస్తాడు. అతణ్ని ప్రేమించిన వారిని ప్రోత్సహిస్తాడు. సామాన్య మత గ్రంథాల ఆధారంగా దేవుడి రూపం స్థూలంగా అతడి స్వభావం ఇది. అయితే అనేక ఆశక్తికర అవసర ప్రశ్నలు మామూలుగానే మనకి వస్తాయి. వాటికి సమాధానం చెప్పేటంత ఓపికా, సమాధానాల కోసం ప్రయత్నించేటంత తీరికా ఆస్తికత్వానికీ, దాని ఆధారంగానే జనించిన మతానికీ వుండవు. ఎందుకంటే మతం ప్రశ్నకి వ్యతిరేకం. ప్రశ్ననేది దాని అస్తిత్వాన్ని ఎక్కడ ప్రశ్నిస్తుందోనని మతానికి భయం అందుకే అది ఆలోచించకుండా తనని అనుసరించే విశ్వాసులకి అభయం ఇవ్వగలదే తప్ప ఆలోచనపరులెవర్నీ సమాధానపర్చలేదు. దేవుడనే ఒక అతీత అనాలోచనకి తోచినన్ని వికార లక్షణాలు ఆపాదించగలదే కాని, ఆధ్యాత్మికమైన ఏ అంశాన్నీ ఆధారాలతో శాస్త్రీయంగా నిరూపించలేదు. అందుకే మతాలన్నీ అనుసరించమనే బోధిస్తాయి తప్ప అన్వేషించమని చెప్పవు. ఒకానొక బలహీన క్షణంలో ఆదిమ మానవుడి మనసులో అతీత శక్తనే భావం పుట్టింది. రాను రానూ అదే ఆస్తికత్వానికీ మూఢమతానికి దారి తీసింది. కాబట్టి మతమనేది మూఢమనస్తత్వ ప్రధానమైనదే కాని మానవుడి స్వతంత్రాలోచనకి పరాకాష్ట కాదు.

పుట్టుకతో మనిషి తటస్తుడు. ఆస్తికుడూ కాదు, నాస్తికుడూ కాదు. పెరిగే కొద్దీ వ్యక్తి పై పరిసరాల ప్రభావం, పెద్దల ప్రభోదం పనిచేస్తాయి. అప్రయత్నంగానే అతడికి మతం, కులం, భాష, భావజాలం వంటి వన్నీ అబ్బుతాయి. అవే పేర్లకి ముందు పిలకలుగా పేర్ల చివర తోకలుగా వేలాడుతాయి. నాస్తికత్వం ఇహలోక సంబంధమైనది. మనిషిని నడిపించే అతీత శక్తి లేదా వ్యక్తి అస్తిత్వాన్ని నాస్తికత్వం తిరస్కరిస్తుంది. అలౌకిక భావనలన్నింటినీ వ్యతిరేకిస్తుంది. ఈ భౌతిక ప్రపంచానికి అతీతంగా అనస్తిత్వ లోకమనేది ఉండడం సాధ్యం కాదంటుంది. మనిషి తన జీవిత కాలంలో జీవించేదే జీవితం తప్ప అతడికి మరో జీవితమేదీ లేదంటుంది. ఆధ్యాత్మికతకి సంబంధించిన ఏ అంశానికీ సహేతుకమైన ప్రమాణం లేదని నిరూపిస్తుంది. అప్రామాణిక భావనలు అవి ఏవైనప్పటికీ నాస్తికత్వం దృష్టిలో అప్రధానమైనవే. అనాలోచితంగా దేన్నైనా అనుకరించడాన్ని నాస్తికత్వం నిరశిస్తుంది. అందుకే ఆలోచనాపరులందరూ నాస్తికులే నంటాడు ఎర్నెస్ట్ హెమింగ్వే (All thinking men are Atheists) ఎందుకంటే జీవ పరిణామ క్రమంలో ఆలోచననేది మానవుడికి లభించినంత పక్వతతో ఇతర జంతుజాలానికి లభించలేదు. మనిషి మానసిక పరిణామం అతడిలోని బౌద్ధిక వికాసానికి తోడ్పడింది. ఆచరణాత్మకంగా ఆలోచిస్తే నిజానికి (Practically thinking as a fact) ప్రకృతిలో ప్రతీ జీవి అతీత శక్తనే దానికి అతీతంగానే జీవిస్తుంది. ఏ జీవి

కూడా మానవుడిలాగా తన అస్తిత్వానికి అతీతమైన ఆలోచనలు చేయదు. ఆహారం, నిద్ర, మైధునం ప్రతీ జీవికి సహజమే. మానసిక పరిపక్వత మాత్రమే మానవుడ్ని ఇతర జీవుల్నించి వేరు చేస్తుంది. జంతు జాలానికీ, పశుపక్ష్యాదులకీ, క్రిమి కీటకాలకీ బౌద్ధిక పక్వత జరగలేదు. అంటే అవి పూర్తి పరిణామం చెందలేదన్నమాట. ఒకవేళ వాటిల్లో కూడా బుద్ధి పెరిగితే అవి కూడా ప్రాకృతిక పరంపరలో ఒక అతీత శక్తిని వాటి ఆలోచనలకి అనుగుణంగా ప్రతిష్ఠించు కుని వుండేవి. అందుకే ఒక ఎద్దు కనుక దేవుడ్ని ఊహించుకుంటే ఆ దేవుడికి రెండు కొమ్ములుంటాయంటాడు బెట్రాండ్ రస్సెల్.

అది సహజమే. ఎందుకంటే మనిషి దేవుడనే వాడ్ని తన కన్నా పెద్దగా, బలవంతుడిగా తన కంటే ఎక్కువ కాళ్ళూ, చేతులు, తలలు కలవాడిగా ఊహించుకున్నాడు. ఆనాటి అతడి నమ్మకానికి ప్రకృతి పర సంఘటనలు కారణాలైనాయి. ఎండ, వాన, ఉరుములు, పిడుగులు, మంచు తుఫానులు, హఠాత్తుగా మారిపోయే వాతావరణం, ఆకస్మాత్తుగా దర్శనమిచ్చే అనేక ప్రమాదాలు... అన్నీ అతడ్ని ఆలోచించేలా చేసాయి. ఆ సమయంలో అతడి ఆలోచనలు భిన్నవిధాలుగా సాగాయి. అందుకే ఆదిమ మానవుడి ఊహల్లోని దేవుళ్ళూ, దేవతలు సైతం అతడిలా నగ్నంగా కొందరూ, అతడి కంటే అందంగా, మందంగా, ఆయుధ దారులుగానో, అమానవీయ రూపంతోనో ఉంటారు. ఆనాటి మానవుడి ఆలోచనా పరిధి అంతవరకే పరిమితం. అయితే, ఆ ఆలోచనల తీరు మారుతూ మతంగా స్థిరపడింది. మతం ఎప్పుడూ స్వయం ఉన్మాదమే. దానికి మానవుడి ఆలోచనల్లోనూ, ఆచరణల్లోనూ పనిలేని స్వతంత్ర విద్వేషం ఉంది. అసలు దాని ఉద్భవమే ఉన్మాదంతో జరిగింది. చరిత్రలో మతం పేర జరిగినంత మారణహోమం మరే పేరుతో జరగకపోగా, అసలు చరిత్రనేది లిఖించక ముందు, అంటే చరిత్రకు పూర్వం మతం జరిపిన విచ్చలవిడి హత్యాకాండల చిట్టా పద్దుల్ని మన స్మృతుల్లోనూ, బైబిల్ కథనాల్లోనూ, ఖురాన్ సురాలలోనూ ఈనాటికీ లీలగా పరిశీలించవచ్చు. ఇప్పుడు మత హింస ప్రస్తావన ఎందుకంటే, అవన్నీ ఆస్తికులైనటువంటి ఎవరో ఒక దేవుడి భక్తులు జరిపిన మారణకాండ అని చెప్పడంతో బాటూ నాస్తికత్వమంటేనే ఆమడ దూరం జరిగే అభినవ ఆస్తికులకి నాస్తికత్వపు నిజస్వరూపం తెలపాలనేదే నా ప్రయత్నం. నాస్తికత్వంతో పోలిస్తే ఆస్తికత్వం ఎంత హింసా మార్గమో మతశిఖామణులకి విశదం చేసేందుకే ఈ వివరణ.

## దేవుడు – జీవుడు !

ప్రాకృతిక పదార్ధ పరిణామంలోని ఒకానొక దశలో పదార్ధం ప్రతిష్ఠించిన ప్రత్యేక

సంయోగ ఫలితమే జీవావిర్భావం. జీవావిర్భావం యాదృచ్ఛిక పాదార్థిక సంఘటనే కానీ ఎవరో పూనుకొని చేసింది కాదు. జీవమనేది ఒక తరహాగా రూపుదిద్దుకోవడానికే కొన్ని లక్షల కోట్ల సంవత్సరాలు పట్టింది. జీవావిర్భావానికి అవసరమయ్యే అనేక పాదార్థిక సముదాయం భూగ్రహంలో ఉన్నందునే ఇక్కడ జీవం ఉద్భవించడం సంభవించింది కానీ ఈ ధరణిని ఎవరూ గుత్తకి తీస్కుని జీవాన్ని సృష్టించలేదు. ఆవిర్భవించిన తర్వాత జీవి అనేక సంఘర్షణల్ని జీర్ణించుకుని అభివృద్ధి చెందింది. అనేక పోరాటాల్లో రాటుదేలింది. పరిస్థితులకి ఎదురుతిరిగి వాతావరణ మార్పులకి తట్టుకోగలిగిన జీవజాలం మాత్రమే బ్రతికి బయటపడింది. మిగిలినదంతా తుడిచిపెట్టుకుపోయింది. ఛార్లెస్ డార్విన్ ప్రతిపాదించిన జీవపరిణామ సిద్ధాంతంలో ఇదే మొదటి సూత్రం. ఆ తరువాత పరిణామం వృద్ధి చెంది అపూర్వమైన ప్రాకృతిక పోరాటానికీ, పరిణామానికీ చిహ్నంగా మానవుడు అవతరించాడు. ఇది జరగడానికి కూడా కొన్ని వేల సంవత్సరాల కాలం పట్టింది. అలా ఉద్భవించిన మానవుడనే జీవి మానసిక వికారమే దేవుడనే ఆలోచనకి ఆయువుపోసింది. క్రమంగా అదే మతమనేదాన్ని తెరపైకి తెచ్చింది. అంటే మతమనేది మానవుడి మానసిక పరిపక్వత వల్ల ఏర్పడిన అభిప్రాయమేనన్నమాట. ఆనాటి మనిషి ఆలోచనల స్థాయి అప్పుడే పుట్టిన పసిపిల్లల బుద్ధితో సమానం. ఆ తర్వాత అది మనిషిని వెంటాడి వేటాడి వేధిస్తూనే వచ్చింది. ఈనాటికీ అత్యంత బలంగా సమాజంలో వేళ్ళూనుకుని ఉంది. అంటే మనిషి పిచ్చిని వదిలిపెట్టినా పిచ్చి మనిషిని వదల్లేదన్న మాట. అందుకే మతమనే దొక మానసిక రోగం (Religion is a Mental Disease) అంటాడు ముస్సోలిని. మనిషి మానసిక స్థితిపై మతమంత ప్రభావం ప్రదర్శించినది మరేదీ లేదు.

మతం మనిషికి అమానుషత్వాన్ని నూరిపోసింది. తన మతం కాని వార్ని అంటే అన్య మతస్థులని జాలి పడకుండా చంపమని చెప్పింది. మతం దాని ఆవిర్భావం నుంచి మనిషిని లొంగదీసుకునేందుకు చేయకూడని పనులన్నీ చేసింది. ముఖ్యంగా మతాన్ని పరలోకాన్ని అంగీకరించని వార్ని నాస్తికులంటూ దూషించింది. నాస్తిక పదం మొదట్లో ఆస్తికుల చేత తిట్టుగా వాడబడింది. అందుకే మతం అస్తిత్వమే మానవత్వపు స్వభావానికి ముప్పు తెచ్చే స్థితి దాపురించింది. హైందవ దేవుళ్ళందరూ ఆయుధాలు చేత బట్టుకుని హింసని ప్రేరేపించినవారే. మనుషుల మధ్య వర్ణాంతరాల్ని సృష్టించి స్మృతుల్తో మనిషిని మనిషి ద్వేషించే వ్యవస్థకు రూపకల్పన చేసిన హింసోన్మాదులందరూ హిందూ దేవుళ్ళే. దేవుడి కుమారుడిగా క్రీస్తు పాత్ర చేత త్యాగ సూత్రాలు వల్లించిన బైబిల్లోని క్రైస్తవ దేవుడి దురాగతాలు

కూడా చెప్పశక్యమయ్యేవి కావు. ఆ దూర్త దేవుడు వేధించిన వ్యక్తుల కళేబరాలు, పారించిన నెత్తుటి నదులు లెక్కలు కడితే పొద్దుచాలదు. ఖురాన్ పేరిట సురాలు అల్లిన మహమ్మద్ యుద్ధోన్మాది. అతడిలాగానే ముస్లిమ్‌ల లుచ్ఛాదేవుడు కూడా ఖురాన్‌లోని ప్రతి పాదంలోనూ వీలైనప్పుడల్లా అవిశ్వాసుల ప్రస్తావన తెచ్చి వాళ్ళని నిర్ధాక్షిణీయంగా చంపమన్నాడు. పైకి అపర మానవత్వాన్ని అవే మొట్ట మొదట కనిపెట్టినట్లు అమాయక మొహం పెట్టే ప్రతీ మతమూ అంతర్లీనంగా మరో మనిషిని శత్రువుగా చూడమనే చెప్పింది. మతమనేది మతతత్వాన్నే పెంచడానికి ప్రయత్నిం చింది తప్ప ఎన్నడూ మానవత్వాన్ని ప్రభోదించలేదు. అందుకే "History teaches us that no other cause has brought more death than the word of god" అంటాడు గిలియన్ బుజిల్లా !

## నాస్తికత్వ నైజం !

అయిదారు సంవత్సరాల క్రితం నేను ప్రపంచ నాస్తిక మహాసభల్లో పాల్గొనడం జరిగింది. ఆంధ్రదేశంలో ప్రధమ నాస్తిక కేంద్ర స్థాపకులయిన గోరా గారి భావజాల ప్రధానంగా అవి జరిగాయి. అప్పుడు చదివిన గోరా గారి రచనల్లో అనేక గందరగోళ విషయాలు నాకు స్ఫురించాయి. ఆయన నాస్తికత్వంగా భ్రమపడుతోంది నాస్తికత్వం కాదనీ అది 'నాస్తితత్వమ' ని, ఈ విషయంపై రావిపూడి వెంకటాద్రి గారు అప్పటికే విమర్శించి రచనలు చేసారని తెల్సింది. అప్పటికే నాకు వెంకటాద్రి గారితో పరోక్ష పరిచయం ఉంది. మా మధ్య ఉత్తర ప్రత్యుత్తరాలు నడిచేవి. వెంకటాద్రి గారి రచనలు విస్పష్టంగా నాస్తికత్వాన్ని, హేతువాదాన్ని దర్శించాయి. రావిపూడి వారు రాయిస్టు, రాడికల్ హ్యూమనిస్టును. ఆయన అప్పటికే మార్క్సిజం పైనా మతం పైనా అనేక విశ్లేషనాత్మక వివేకవంతమైన గ్రంధాలు రచించారు. ఆయన హేతువాదం మానవ శాస్త్రీయ విజ్ఞాన మార్గాన్ని శ్లాఘించి భావితరాలకి స్ఫూర్తినందించేదే. అయితే నాస్తికత్వాన్ని నవ్యమానవవాదంతో ముడిపెట్టడమే మానసిక అవివేకాన్ని ఆలస్యంగా వెలుగులోకి తెచ్చింది. మార్క్సిస్టు మహాభారతంపై నిప్పులు చెరిగే రాడికల్ హ్యూమనిస్టులు రాయిస్టు రామాయణాన్ని నెత్తికెత్తుకున్నారు. మార్క్సిజం మోహమయితే రాయిజమొక రోగం. రెండూ వ్యక్తిలో విపత్కర భ్రాంతుల్ని ప్రవేశపెట్టేవే. మత తత్వాన్ని వ్యతిరేకిస్తున్నామంటే దానర్థం మరో రకమైన మూఢత్వాన్ని ప్రజలలో ఆహ్వానించమని కాదు. అజ్ఞానం కూడదంటే దానర్థం అర్ధజ్ఞానాన్నో అల్పజ్ఞానాన్నో ఆర్జించమని కాదు కదా! సాధ్యపడినంత శాస్త్రాన్ని మనిషి విస్తరించేందుకు

ప్రయత్నిస్తాడు. అందుకు అతదార్జించిన జ్ఞానం తోడ్పడుతుంది. జ్ఞానం అల్పమూ, అధికమూ తప్ప శూన్యమో, పరిపూర్ణమో అవడం ఉండదు. ప్రాపంచిక గమనాన్ని అవగతం చేసుకునేందుకు మనిషి సముపార్జించ ప్రయత్నించే బౌద్ధిక పాదార్థిక సృజనల్నే జ్ఞానమంటాం. మనిషి జ్ఞానపరిధి అంతకంతకూ విస్తరిస్తూనే వుంటుంది. కానీ పరిపూర్ణ జ్ఞానమనేది సాధ్యమవదు.

మార్క్సిజం గతితర్కం పేరుతో గారడీ చేసి గతిలేని తిక్కని ప్రతిపాదిస్తే రాయిజం రాడికల్ హ్యూమనిజమంటూ మతిలేని మార్పుని ప్రదర్శించ ప్రయత్నించింది. ఆకలి కబుర్లు ఆకళింపు చేసుకున్న ప్రతీ సిద్ధాంతమూ ఆర్థికత పేరిట తప్పటడుగులు వేసినట్లే అతి తెలివిని అర్థాచరణ లకి కలిపి కాలుదువ్విన కుహనా రాద్ధాంతాలు కూడా ఆలోచనల్లో పక్కదారి పట్టాయి. మార్క్సిజం ప్రతిపాదించిన దోపిడీని ఖండించే ప్రయత్నం చేయడానికి ఏ వాదమూ సరిపోదు. ఎందుకంటే మార్క్స్ అనబడే మహోన్నత తాత్వికుడి మహాకృషికి అది నిదర్శనం. అయితే అక్కడి వరకూ శాస్త్రీయంగానే సాగిన మార్క్సిస్టు ధోరణి గతితర్కమనే త్రిక సిద్ధాంతంలో దారి తప్పింది. మార్క్సిజపు అక్షింతలు తలపై జల్లుకుని అక్షరాభ్యాసం ఆరంభించిన రాడికల్ హ్యూమనిజం మనుషుల్ని మార్క్సిజం లా వర్గాలుగా వర్ణించడం సరుకు సంప్రదాయానికి చిహ్నమని వల్లించి మనిషిని రాళ్ళు రప్పలతో మాత్రమే పోలుస్తామంటున్నారు రాయిస్టు మానవ వాదులు. మత మూర్ఖత్వం పై అంతెత్తున లేచే ఈ ఇరువర్గాల మూర్ఖులూ వీళ్ళ ముతకవాదాల అతుకులు సవరించుకునేందుకు ఇష్టపడరు. పరిణామం శాశ్వతమని వక్కాణించడమంటే ప్రగతి దిశగా పయనించే తాత్కాలిక మానవ మజిలీల్ని వ్యతిరేకించమని కాదు. అసలు ఎంత గొప్ప వ్యవస్థయినా అనంతమయిన కాలగమనంలో అల్పమైన భాగస్వామ్యత్వాన్ని ప్రతి ఫలించేదే. మానవుడి సత్యాన్వేషణ, స్వేచ్ఛా పిపాసల్ని ప్రస్తుతించడమంటే వర్తమాన సమాజాన్ని సవరించే సమూల ప్రయత్నాల్ని తిరస్కరించడం కాదు. పరిణామమంటే సాగడమే కానీ సాగదీయడం కాదు. స్వేచ్ఛా, హేతుత్వం ఆధారంగానే జనించానని చంకలు గుద్దుకుంటున్న రాయిజం ఆ పని ఎంతవరకూ చేసిందో పరిశీలించడం అప్రస్తుతం కాదనే అనుకుంటాను.

## మానవవాదమా ? మాయావాదమా ?

స్వేచ్ఛ మానవుడి ఇచ్ఛ. అది అతడి స్వీయ ఇచ్ఛ. స్వేచ్ఛ ఆధారంగానే ఆలోచన జనిస్తోంది. సత్యం మనిషి గ్రాహ్యానికి అందేదే. దాని పునాదిగానే అన్వేషణ ఆవిర్భవిస్తోంది.

అప్పటికే అస్తిత్వంలో నున్న మానవార్జిత విజ్ఞానశాస్త్రం విశ్వతత్వాన్ని గ్రహించడానికీ తద్వారా సత్యాన్వేషణ సల్పడానికి తోడ్పడుతుంది. అంతేకానీ స్వేచ్ఛే నిజమని, స్వేచ్ఛే సత్యమనీ, సత్యమే సర్వమనీ, సత్యమే సత్యమనీ, సత్యం కోసమే అన్వేషణనీ... అంతా అన్వేషణేననీ... ప్రతీదీ అన్వేషణేననీ అఘోరించినంతలో పదాల యదార్ధర్ధాలకి అలౌకికర్ధాలేవీ అదనంగా కాలవవు. పదాలకి పారలౌకిక శక్తులేవీ సిద్ధించవు. సరే అవసరమైనంత మేరకు ఈ పంథా సరయినదే అనుకుందాం. కానీ మొదలు, మధ్య, తుది... మొత్తం కధనంతా వీటి చుట్టూరానే తిప్పుతూ కాకమ్మ కబుర్లు చెబుతూ మానవుడే అన్నింటికీ ప్రతీకనీ, మానవుడే ప్రతీదానికీ ప్రమాణమనీ ... మానవుడే ప్రతిభాగానికీ కొలమానమనీ... అసలు మానవుడు మానవుడేననీ... మానవుడు మానవుడు మాత్రమేననీ... మానవుడు మాత్రమే మానవుడనీ... ఇదేం అఘాయిత్యం ? మానవుడు మానవుడు కావడమేమిటి ? అలాకాక మరేమౌతాడు? ఏదో ఒకటి అయితే మాత్రం మూల మానవుడు ఎక్కడికి పోతాడు? ఈ మాయావాదపు మానవవాద మతలబు ఏంటి? అసలింతకీ మానవవాదాల నేపధ్యం ఏంటి? మనిషిని గురించి చెప్పే మానవ క్షేమ వాదాలన్నింటినీ మానవవాదాల నొచ్చు. మనిషికి అతీతమైన ఆధ్యాత్మిక సరంజామా నంతా వంటబట్టించుకున్నవి మానవాతీతవాదాలు, మనిషిని మనిషే ద్వేషించుకోమని చెప్పి మనుషులు ఒకర్నొకరు చంపుకునేలా చేసేవి మానవాధమ లేదా మానవహీన వాదాల కోవలోకి వస్తాయి. సాంఘిక సిద్ధాంతాలన్నీ మానవవాదాలే అయినపుడు మరి మానవవాదం పేరుతోనే ప్రత్యేక ఫీట్లూ, పాట్లూ ఎందుకంటారా? మనకంటూ స్వంతంగా అంతరాత్మలేనప్పుడు, ఆ ఉన్నది కాస్త వేర్పాటువాదానికే అంకితమైనపుడూ అర్ధంలేని నూతనావిష్కరణలు జరగడం పరిపాటే. ఇది ఆ తరహా అన్నమాట.

స్వేచ్ఛా ప్రస్థానాన్ని ప్రస్తుతిస్తున్నామంటే దానర్ధం మానవ ప్రయత్నం వల్ల జనించిన అపూర్వమైన ఇతర వాస్తవ వాదాల వునికిని వ్యతిరేకించమని అర్ధం కాదని, అసలా అర్ధం రాదని చెప్పకున్నాం కదా. గతితర్కం అశాస్త్రీయమే, అయినా దోపిడీ వాస్తవమే. దోపిడీకి పరిష్కారం చూపకుండా స్వేచ్ఛా, స్వేచ్ఛంటూ రచ్చ చేసినంతలో రాయిజం సార్వత్రిక మానవ వాదమైపోదు. జీవితం దుందుడుకు సంఘటనల సమ్మేళనమైనంతమాత్రాన ప్రతిపాదించ బడే ప్రతి సిద్ధాంతమూ సార్వజనీనమైపోదలిస్తే సంచారయిన ప్రతీ దేశదిమ్మరి సన్యాసి, సన్నాసుల్ని మహాతాత్వికులుగానే పరిగణించాల్సి వుంటుంది. బాహ్య దృష్టికి ఆకర్షవంతం గా తోచిన ప్రతీ సందు సిద్ధాంతమూ సార్వజనీనతని సంతరించుకోలేదు. రాయిజం కూడా ఇందుకు మినహాయింపు కాదు. మార్క్సిస్టుల మంకుపట్టు నుంచి చరిత్ర బయట

పడకముందే రాయిజం తన రంకుని కొత్త రంగుల్లో ప్రదర్శించప్రూనుకుంది. ఎప్పుడూ ఏదో అలా... అలా... నడుస్తూనే వుంటుందనీ... ఎన్నడూ అలా వెలుతుండేదే నిజమనీ... అదే సిసలైన సిద్ధాంతమనీ వాదించడం తిరోగమనవాదానికి తాత్విక సూత్రం. ప్రస్తుతమున్న వ్యవస్థని వైప్లవదిశగా నిర్దేశించే నైతిక వాదాల్ని పరిశీలించడమే సామాజిక తత్వవేత్తల ప్రాధమిక విధి. అంతేకానీ అహంకారానికి పోయి అర్ధంలేని వాదాల్ని, అసలర్ధం కాని సిద్ధాంతాల్ని మెడకు తగిలించుకుని అభ్యుదయ వాదులతో యుద్ధానికి దిగడం కాదు. సత్యం, స్వేచ్ఛ, అన్వేషణలు ఏ వృద్ధిదాయక సిద్ధాంతాని కయినా సాధారణ మూల సూత్రాలే. వాటిని పునాదిగా చేసుకొని వృద్ధవించిన తత్వాలన్నింటికీ సమాజ శ్రేయస్సే ప్రధానం. అంత మాత్రంలో ఆ పదాల్నుపయోగించి ఫీట్లు చేయగల చేవ అన్ని వాదాలకి ఉండదు.

భావ విప్లవమంటే పదాల్తో బాతాఖానీ కొట్టడం కాదు. వర్గ చైతన్యమంటే వైరుద్యాల్తో వివాదాల్లో మునిగి తేలడమూ కాదు. విస్పష్టంగా వర్ణించినంతలో వికారాలన్నీ విప్లవమైపోవు. అందంగా అల్లినంతలో అస్పష్ట భావాలు అర్ధవంతమైపోవు. కమ్యూనిస్టులు తమ కుతర్కాన్ని గతి తర్కమని పిలుచుకుంటే, రాయిస్టులు వీరి కుతితర్కాన్ని రాడికల్ హ్యూమనిజమని పిల్చుకుంటారు. శివున్నో, విష్ణువునో గుర్తుకు తెచ్చుకుని కుత్తుకలు తెగ్గోసుకోకపోతే శైవులకీ, వైష్ణవులకీ ముద్ద దిగనట్లూ, దిగినది అరగనట్లు మార్క్సునో, మానవేంద్రనాథరాయ్‌నో తల్చుకుని ఒకర్నొకరు తిట్టుకుని, అరుచుకుని, అవసరమయితే చరచుకుని, కరుచుకుంటే గాని వీరిరువురికీ సాంఘిక ఉద్యమాల మాట పెగల్దు. కలం కదల్దు. బాట కానరాదు. మతాలు మనిషిని పరలోకం పేరుతో నిద్రబుచ్చడానికి ప్రయత్నిస్తే, మానవవాదాలు ఇహలోకం ముసుగులోనే పడుకోబెట్టాలని చూస్తున్నాయి. వాటి ఉద్బోధ ఉగ్రంగా మొదలెట్టి దశాబ్ధాలు, శతాబ్ధాలు దాటి సాగిపోయినా వాటికింకా తెల్లారినట్లు లేదు. రాత్రి జాగారంలో కునుకుపాట్లు పడుతూ అదే జాగృతావస్థగా భ్రమిస్తున్నాయి. చేతిలో దీపం దారి తప్పకుండా నడవడానికి పనికొస్తుందే కానీ చీకటిని తొలగించడానికి ఆ చిరుదీపపు వెలుగు సరిపోదు. దానికి వైప్లవావశ్యకత దోహదం చేస్తుంది. సాంఘిక సిద్ధాంతమేదైనా మనిషినే ప్రమాణంగా తీసుకుంటుంది. అలాటి వాదాలన్నీ బూటకమంటూ నూతన నాటకం మొదలెట్టే వాదమేదైనా అది మాయావాదమే తప్ప మానవవాదమో మరొకటో కాదు. మార్క్సు కూసిందీ, రాయ్ రాసిందీ బట్టీ పట్టిన భట్టువిక్రమార్కులందరూ వాళ్ళ బలప్రదర్శన పై పెట్టిన దృష్టిలో శతవంతు శాతం భావ పరిణామంపైపెట్టుంటే ఈపాటికి కొద్దో గొప్పో సాంఘిక పురోగమనానికి మార్గం సుగమం అయ్యుండేది. మార్క్సిజం

కుతర్కతత్వం అదేపనిగా ఆలపించే రాయిజం తత్వతిరోగమనానికి చిహ్నం.

మార్క్సిజాన్ని మైలపర్చాలనీ, అదెలా ఆచరణ సాధ్యంకాని వాదమో, అశాస్త్రీయ సిద్ధాంతమో వీలైనప్పుడల్లా వివరించడానికి తహతహలాడే తత్వదిమ్మరి సిద్ధాంతాలు చాలానే ఉన్నాయి. మానవవాదమంటూ కొత్త గోల మొదలెట్టానని భ్రమపడుతున్న రాడికల్ హ్యూమనిజం ఆ బృహత్తర కార్యాన్ని మొదలూ పెట్టలేదు, తుదకూ చేర్చలేదు. ఒకసారేమో మార్క్సిజానికి ప్రత్యామ్నాయమనీ, మరోసారేమో సవరణనీ, ఇంకోసారి మార్క్సిజాన్ని పూర్తిగా తిరస్కరిస్తున్నామనీ, మార్క్సిజంలో గతితర్కం అశాస్త్రీయమే కానీ అదనపు విలువ సిద్ధాంతం (Surplus value Theory) శాస్త్రీయమేననీ, సంఘ సంఘర్షణలు భావ్యమేకాని వర్గపోరాటాలకి తాము విరుద్ధమని... ఇలా మానవవాదం వెరసి రాయిజం సొంత మొహాన్ని మసిపూసి మారేడుకాయ చేసుకుని చివరికి స్వే(పి)చ్ఛ సిద్ధాంతంగా మిగిలిపోయింది. అస్తిత్వంలోనున్న ఆధారాన్ని కాదంటున్నామంటే అందుకు ప్రతిగా మనం ప్రతిపాదించే లేదా అనుసరించే వాదాల సైద్ధాంతిక స్థాయి వున్నదానికంటే గుణాత్మకంగా, గణాత్మకంగా స్పష్టంగా వుండాలి. వెనుకటికి ఒక రాయిస్టు రాయిజాన్ని తిరగరాయాలా? అనే మీమాంసలో వుంటే ఆ అవసరం లేదని రాయిజం తలకెక్కిన మరో రాడికల్ రాయిస్టు రాసారు. ఎటుతిప్పి ఎటొచ్చినా రాయిజం రాయిలాగే వుంటుంది కానీ దానికి మారే తీరులేదనే విషయం ఆ పెద్దాయనకి ముందే తెలుసేమో! అందుకే ఎంత తిప్పినా, ఎన్నాళ్ళు తోడినా రాయి రాయే కానీ అది కాయ కాదనీ, కాలంతోబాటు పక్వం చెందే స్వభావం దానికి లేదనీ పాపమయినా, ఆయన అనుయాయులు రాయిజానికి కాపలా కాస్తున్నారు.

## నాస్తికత – నైతికత !

ఆస్తికత్వం ఆవిర్భవించడానికి ముందే అనేక వేల సంవత్సరాల ప్రాకృతిక పరిణామం, పాదార్థిక ప్రస్థానం జరిగాయి. వాటన్నింటికీ ఆస్తికత్వమేమీ తోడ్పాటునివ్వలేదు. అంటే తనకతీతమైన శక్తి వుందనేది మానవుడనే జీవి రూపొందాక, అతడిలో భావోత్పత్తి రూపొందాక వుద్భుద్ధమయిన ఆలోచనే కానీ అప్పటికి భౌతిక విశ్వంలో అసలు భావమనేదే లేదు. భౌతిక అభివృద్ధితో బాటుగా మనిషి బౌద్ధిక అభివృద్ధి కూడా పురోగమించాక మతమనేది రూపుదాల్చింది. నిజానికి మతానికి పూర్వమే నీతనేదుంది. అయితే మతాధిపతుల పరిపాలన కాలంలో వాళ్ళకి నచ్చిన విధానాలన్నీ నీతి సూత్రాలుగా అమలయ్యేవి. జంతుజాలం నుంచి విడిపడ్డమే మనిషి నైతిక పరిణామాన్ని తెలిపే ప్రమాణం. అయితే మత

నైతికత నీతి పేరుతో నియంతృత్వాన్ని ప్రవేశపెట్టింది. సమాజంలో నైతిక సూత్రాలుగా సొంత విలువల్ని బలవంతంగా చెలామణీ చెయ్యనారంభించింది. మొదట్లో మతం మతాధిపతుల ఆధ్వర్యంలో, వారి కనుసన్నల్లోనే సాగింది. ఏకాభిప్రాయాల్నే సాంఘిక ధర్మాలుగా చెలామణీ చేసిన మతాధిపతులు సహజంగానే మార్పుకి వ్యతిరేకులు. ఎక్కడైనా ఏ కాస్త విరుద్ధ ధోరణి కనబడ్డా, దాన్ని అణిచివేసేంతవరకూ నిద్రపోయేవారు కాదు. మనిషి మానసిక స్వేచ్ఛకి మతాధిపతులే మొదటి శత్రువులు. ఆనాటి నుంచీ ఈనాటి వరకూ ఈ క్రమం సాగుతూనే ఉంది. అందుకే, "In every Country and in every age, the priest has been hastile to liberty." అంటాడు థామస్ జెఫర్‌సన్. మతాధిపతుల దృష్టిలో మిగిలిన మానవులందరూ అధములు. తమ గుణం మాత్రం అధికులు. మెజారిటీ మనుషుల బలహీనత అయిన భగవంతుడనే భావనా, తద్వారా జనించే భక్తి మాత్రమే మతదోపిడీదారుల జీవనాధారం. మానవాతీత అంశాల్ని అతీంద్రియ విషయాన్ని అత్యంత ఆకర్షవంతంగా తమ కుయుక్తులతో బోధించడంలో వీరికివీరే సాటి. దైనందిన కార్యక్రమాల నిర్వహణతోబాటు రోజుకో కొత్త వికారాన్ని ప్రవేశపెట్టి ప్రజల సొమ్ము దండుకోవడమే వీరి ప్రధమ కర్తవ్యం.

నీతికి మతంతో సంబంధం లేదు. పైగా వైరం కూడా. నీతికి మనిషితో మాత్రమే సంబంధం. ఎందుకంటే, ఏ మత దేవుడయినా మతగ్రంధాల ప్రకారమే నీతికి బద్ధ వ్యతిరేకులు. వారి ఆలోచనలకి అనుగుణంగానే మనిషి నడవాలనుకున్నారేకానీ మనిషనే వాడికి స్వేచ్ఛగా యోచించే హక్కువుండకూడదని తీర్మానించారు. అందుకే తమని కాదని స్వతంత్రంగా ఆలోచించిన వారిని క్రూరంగా, నిర్దాక్షణీయంగా చంపించారు. అలా చేయడం ద్వారా సమాజంలోని ఇతర మతాల వారినీ, అప్పటికే నిద్రపోతున్న స్వీయభక్తుల్ని తమ అదుపాజ్ఞల్లో పెట్టుకోవాలని చూసారు. కాబట్టి మతశాస్త్రమనేది మతాధిపతుల స్వీయపైత్యం ప్రధానంగా రచించబడ్డదేకానీ మానవుడు నీతిగా జీవించడానికి కావలసిన నైతిక పక్వత అందులో లేదు.

అదీకాక ఎవరో కొద్దిమంది పూర్తిగా మత్తులో మునిగిన బాపతు తప్ప మినహా అందరూ, వారే మతానికి చెందినవారైనప్పటికీ మతాధిపతులందరూ సమాన మోసగాళ్ళే. ఎందుకంటే వాళ్ళ మత నిష్ఠలు, మడి విశ్వాసాలు సామాన్య ప్రజానీకాన్ని వెర్రివాళ్ళని చేయడానికే కానీ తమని తాము నిజంగా దేవుడున్నాడనే దృక్పథంతో అంకితం చేసుకోవడానికి కాదు. మతం పేరుతో జరిగినన్ని అకృత్యాలు, జరుగుతున్న మోసాలు ఆనాటికీ, ఈనాటికీ మరే

అంశంలోనూ జరగడం లేదు. మనుషుల్ని మనుషులే చంపుకుందుకు ప్రోత్సాహించిన బోధనాంశం బహుశా మతం తప్ప మరేమీ లేదేమో! అందుకే మతాలన్నీ ఒకదాన్ని మరొకటి ఎప్పుడూ ద్వేషించు కుంటూనే సమయమొచ్చిందే తడవుగా శాంతి మంత్రాలు, నైతిక సూత్రాలు, మభ్యపెట్టే విధంగా వల్లిస్తూనే వుంటాయి. మతాలకి మూర్ఖత్వమే తప్ప మానవాళి కోసం నైతిక సూత్రాల్ని నిక్షిప్తం చేసేటంత మస్తిష్కం లేదు. ఇక పై రాదు.

## నాస్తికత – నాగరికత !

వ్యక్తి సంఘంలో సమిష్టిగా జీవించడానికి అవసరమయ్యేది నీతి. నీతి ప్రతిపాదికంగానే నైతిక విలువలు ఏర్పర్చుకోవడం జరుగుతుంది. ఆదిమ మానవుడు అనాగరికుడే. నాగరికత అనేది నరుడు నిర్మించుకున్న మహానగరాల ద్వారా వచ్చిందేకానీ ఏ వ్యక్తికి అది పుట్టుకతో అబ్బదు. తన చుట్టూ వున్న పరిసరాల్ని గ్రహించడం ద్వారా మనిషి అనేక విషయాలు నేర్చుకుంటాడు. అలాగే నలుగురితో కలిసి మెలిగే విధానాన్ని అలవర్చుకుంటాడు. అతడి వ్యక్తిగత విధానాలు ఇతరుల అస్తిత్వానికి భంగం కలిగించకుండా ప్రవర్తించడమే మానవుడేర్పర్చుకున్న నైతిక ధర్మాల ప్రాథమిక సూత్రం. అంటే మనిషి అలవర్చుకున్న అలవాట్లూ, జీవనశైలీ మొదలైనవి రాను రానూ ఉన్నతీకరించుకోవడానికే అతడు ప్రయత్నించాడు. ఆ విధంగా మానవుడి మానసిక పరిపక్వతే నైతికతకయినా, నాగరికతకయినా, కారణమయ్యిందే తప్ప మతానికిందులో గుత్తాధిపత్యమేమీ లేదు.

మతం మానవ మనుగడకి తానే మూలమని నమ్ముతుంది. తన కతీతంగా ఏదీ వుండదనే భ్రాంతి దానిది. మనిషికి స్వతంత్రం లభించడమంటే తన పట్టులో నుండి అతను తప్పిపోతాడేమోనని పాపం అది బెంగపడుతుంది. దానికంటూ స్వీయ పరిణామం ఎలాగో సాధ్యం కాదు. కావున దాని కళ్ళన్నీ మానవుడి స్వేచ్ఛాలోచనని ఎంతవరకూ కట్టడి చేయొచ్చని మాత్రమే. ఎందుకంటే స్వేచ్ఛనే పదం వింటేనే దానికి పిచ్చెక్కుతుంది. అదెలాగూ ఉన్మాదావస్థకి చేరుకోవడానికి అట్టే కాలం పట్టదు. పిచ్చికుక్కని వదిలేస్తే వచ్చే ప్రమాదమే పిచ్చెత్తిన మతాన్ని సమాజంలో బతకనిస్తే దాపురిస్తుంది. మతోన్మాదం మెదడుకెక్కితే అది మధోన్మాదంగా మారుతుంది. రాత్రికి రాత్రి మనుషులందర్నీ తన మతంలోకి మార్చేయాలన్న పిచ్చ రోజురోజుకీ మోతాదు మించిపోతుంది. అందుకోసం ఎందుకైనా తెగించే మనస్తత్వం మొదలౌతుంది. మానవుడిలో అమానుషత్వం పెట్రేగిపోవడానికి మత బోధలనేకం దోహదం చేస్తాయి. ఆ బోధ బుర్రకెక్కితే బుద్ధిహీనతకైనా దారితీస్తుంది లేదా విపరీత

చారిత్రక తప్పిదమంటూ బుద్ధిగానయినా స్థిరపడుతుంది.

ఈ ప్రపంచానికి అతీతంగా ఏదోక అలౌకిక శక్తి వుందనుకోవడం మనిషి ప్రాథమిక అవగాహనాలోపం వలన ఏర్పడిన అభిప్రాయం. ఆ అభిప్రాయం స్థిరంగా సాగి మధ్యలో మతంగా మారి బలపడింది. మతం మనిషిలో మంచి జాడ చూడనిరాకరించింది. అందుకే ఏ మతానికామతం మానవాతీత రోగాన్ని మనిషికి బోధించి మనిషికి అమానుషమైన అస్తిత్వాన్ని కల్పించింది. సత్యాన్వేషణకి శోధన అవసరం కాని అసత్యానికయితే అంగీకారం చాలు. అందుకే భక్తులైన మతాభిమానులందరూ అసత్యాన్ని అప్రయత్నంగా అంగీకరించడానికి సిద్ధపడే మానసిక బద్ధకస్తులే. అందుకే ఆధ్యాత్మిక తత్వసాధనకి పెద్దగా బుద్ధిని ఉపయోగించే పనుండదు. ఎందుకంటే, అప్పటికే అలంకరించబడిన సుందర సిద్ధాంతాలెన్నో వారికోసం ఎదురు చూస్తుంటాయి. అటువంటి పరలోక పావన వాదాలన్నింటినీ తప్పించుకుని తాత్వికమార్గం పట్టడం అంత తేలికయిన విషయం కాదు. ఎందుకంటే ఒక మతం మత్తులో నుంచి బయటపడేలోపే మరో మతం కొత్తమత్తుతో మంది కోసం ఎదురుచూస్తుంటుంది. వాటి బారి నుంచి బయటపడి వైయక్తికంగా స్వీయ అన్వేషణ సల్పడమే సాంఘిక మానవుడికి సరైన మార్గం. “When a man is freed of religion, he has a better chance to live a normal and wholesome life.” అంటాడు మనిషి మానసిక శాస్త్రాన్ని ఔపోసన పట్టిన సిగ్మండ్ ఫ్రాయిడ్. మనిషి మతం నుండి స్వతంత్రం పొంది మతాతీతంగా మనగలిగిననాడే అతడు అనేక మూఢత్వాల నుంచి తప్పించుకుని సంతోషంగా జీవించగలుగుతాడు.

## నాస్తికత్వం – నమ్మకం !

నమ్మకానికి నిజంతో పన్లేదు. కాని నిజానికి అది నిజమని నిరూపించుకోవడం కోసం ప్రమాణాలు చూపించాల్సిన బాధ్యత ఉంది. ఆస్తికత్వం విశ్వాస ప్రధానమైంది. నాస్తికత్వం ఆధార ప్రధానమైంది. ఆస్తికత్వానికి అనాలోచితమైన విశ్వాసం చాలు. నాస్తికత్వానికి నిజాలతో కూడిన నిరూపణ కావాలి. ఆస్తికత్వం అజ్ఞాత కారణంగా రూపొందింది. దాన్ని అంగీకరించడానికి అజ్ఞానం చాలు. నాస్తికత్వం అన్వేషణ ప్రధానంగా ముందుకు సాగేది. జ్ఞాన మార్గమొక్కటే దీనికి శరణ్యం. ఆస్తికత్వానికి అనుసరిస్తే చాలు. నాస్తికత్వానికి సొంతంగా ఆలోచించగలిగే శక్తుండాలి. ఆస్తికత్వానికి భావపరిణామం అక్కర్లేదు. నాస్తికత్వం భావవికాసం వల్ల మాత్రమే రూపొందేది. మతం విశ్వాసం పైనే ఏర్పడింది.

దానికి వాస్తవాల గొడవలేదు. అసలు వాస్తవాల్ని తెలుసుకోనక్కరలేదనుకునేవారే విశ్వాసులుగా మారగలుగుతారు. విశ్వాసమంటే సత్యమేదో తెల్సుకోవాలనే వైఖరి లోపించడమే. అందుకే మత విశ్వాసులందరూ విశ్వసిస్తారు. తప్పితే వివేచనతో ఆలోచించరు. ఎందుకంటే సత్యాసత్య వివేచనకి విశ్వాసం విరుద్ధం. నమ్మకానికర్థం నిజం తెలుసుకోవాలను కోకపోడమే (Faith means not wanting to know what is true) అంటాడు నీషే. సాధారణ మానవుడు అతడి దైనందిన జీవితంలో సహజంగానే కొన్ని సశాస్త్రీయ నమ్మకాలనూ మరికొన్ని అశాస్త్రీయ నమ్మకాలను ఏర్పర్చుకుంటాడు. మత సంబంధమయిన విశ్వాసాలు ముఖ్యంగా వంశపారం పర్యంగా వ్యాధులలాగానే సంక్రమిస్తాయి. అయితే పరిస్థితుల ప్రభావం వలన మతస్థులు మత సంస్కరణ కార్యక్రమాలకి ఆసక్తి చూపడమూ లేదా అన్యమతాంతీకరణ కార్యకలాపాలకి ఆకర్షితులవడమూ జరుగుతాయి. మొదట్లో ఇవి అరుదుగానే సంభవించినా రాను రానూ సాధారణమైపోతాయి. అయితే మతస్థుడు అతడి విశ్వాసాలకి విరుద్ధంగా ఆలోచించడానికి అంత త్వరగా సిద్ధపడడు ఒకవేళ సిద్ధపడినా మూల(ఢ) విశ్వాసాల అస్తిత్వానికి భంగం కలగకుండా జాగ్రత్తపడతాడు. అందుకే విశ్వాసం వాస్తవానికి వ్యతిరేకం అవుతుంది.

మనిషి ప్రాకృతిక పాదార్థిక సంయోగంతో కృషి జరిపి శాస్త్రావిష్కరణలు కావిస్తున్నాడు. మానవుడు సముపార్జించిన విజ్ఞానం విశ్వతత్వాన్ని అతడికవగతం చేస్తుంది. సత్యాన్వేషణకి అది దారి తీస్తుంది. అంటే అతడు మానవుడిగా పరిణామం చెందుతున్న సమయంలోనే నైతికత, నాగరికత, శాస్త్రం, జ్ఞానం అతడికి అవగతమైనాయి. అంతకు ముందే అనైతికత, అనాగరికత, అశాస్త్రం, అజ్ఞానం అతన్లో సహజంగానే భాగమైవున్నాయి. ఆదిమ మానవుడు అనాలోచనా పరుడే. భావోత్పత్తి పూర్వకమయిన ఆలోచనే అతడ్ని పరిపూర్ణ మానవుడిని చేసింది. అతడి ఆదిమత్వ అనాలోచనకి ప్రతిబింబమయిన ఆస్తికత్వం మధ్యమ దశలోనే మతం రూపం రంగరించుకుని రంగస్థలం పై అడుగుపెట్టింది. అజ్ఞానావస్థలో అనాగరికుడయిన మానవుడు అనాలోచితంగా అనుసరించిన అనేక మతక్రతువులు, అర్థరహిత ఆచార సాంప్రదాయ ఆటవిక సాంస్కృతిక అనుకరణలు ఈనాటి నవమానవుడు సైతం ముక్కుమూసుకుని పాటిస్తున్నాడంటే తరతరాలుగా మతమనే పెనుభూతం అతడి మానసిక స్థితిపై ఎంతటి భయంకరమైన ప్రభావం చూపిందో మనం అర్థం చేసుకోవచ్చు. ఇంతకాలం మనిషిని అనేక కారణాల్తో అతి దారుణంగా బంధించి, హింసించిన మతం

ఈనాడు శాంతి సూత్రాల్ని వల్లిస్తూ అహింసా ప్రహసనం ప్రారంభించింది శాస్త్రసాంకేతిక అభివృద్ధిని చూసి హడలిపోయి మాత్రమేనన్నది స్పష్టం.

## నాస్తికత్వం – వ్యక్తిత్వం !

ఆస్తికత్వానికి అవివేకం చాలు. నాస్తికత్వానికి వివేకం కావాలి. ఆలోచించడానికయితే వివేకంతో పని కానీ అనుసరించడానికి అవివేకం చాలు కదా. వివేకం వ్యక్తి ఆలోచనా విధానాన్ని స్వేచ్ఛ దిశగా ప్రోత్సహిస్తుంది. స్వేచ్ఛాలోచనెప్పుడూ గుత్తాధిపత్యాన్ని అంగీకరించదు. అది సొంతనిర్ణయాలు తీసుకోవడానికే మొగ్గుచూపుతుంది. మనస్తత్వాన్ని మరొకరికి తాకట్టు పెట్టదు. వ్యక్తిగతంగా ఏది నీతో, ఏది అవినీతో, ఏది వివేకమో, ఏది అవివేకమో, ఏది వాస్తవమో, ఏది అవాస్తవమో, ఏది స్వేచ్ఛో, ఏది బానిసత్వమో దానికి తెలుస్తుంది. తన స్వతంత్రంపై వేరే ఏ పెత్తనాన్నీ అది అంగీకరించదు. అదే వ్యక్తిత్వం. అది స్వయం వికాసమే కానీ తెచ్చిపెట్టుకునేది కాదు. వ్యక్తి తన స్వీయ తత్వాన్ని తయారు చేసుకునే ప్రయత్నమే వ్యక్తిత్వం. ఆంతరికంగా ఏ రెండు వ్యక్తిత్వాలూ ఒకలా వుండవు. కొద్దో గొప్పో తారతమ్యాలు వుండక మానవు. అంతమాత్రంలో వ్యక్తిత్వాలన్నీ సంపూర్ణ వైరుధ్యాలూ కావు, పరిపూర్ణ విరుద్ధాంశాలూ కావు. బాల్యం నుంచీ పరిసరాల ప్రభావం, పరిస్థితుల ప్రబోధం మనపై పడతాయి. యుక్త వయసుతో బాటే అవి అభిప్రాయాలుగా స్థిరపడతాయి. అయితే వ్యక్తికి వివేకవంతమైన వివేచనతో విషయాల్ని విశ్లేషించే శక్తి వున్నప్పుడు వాటిల్లో ఏది సరయినదో, ఏది కాదో ఎంచుకునే వీలు కలుగుతుంది. అంటే మనిషి మెదడ్ని మించిన మానసిక గురువర్యుడు ఎవరూ లేరన్న మాట. మరి అలాంటప్పుడు ఆధునిక కాలంలో వ్యక్తిత్వానికి ప్రత్యేక తరగతులు ఎందుకన్న ధర్మసందేహం సహజంగానే వస్తుంది. నా ముందు రచనల్లో ఇదే విషయం పై అనేక క్లిష్టమైన అంశాలను విడమర్చి పాఠకుల ముందు పరిచాను. కాబట్టి వీలైనంత క్లుప్తంగా వ్యక్తిత్వానిక్కడ వివరిస్తాను. మానవ చరిత్రగతిని మలుపు తిప్పిన మహనీయులందరూ స్వీయవ్యక్తిత్వాన్ని ఏర్పరచుకున్నవారో లేదా తమ ముందు తరాల మహానుభావుల నుండి స్ఫూర్తి పొందినవారో మాత్రమే తప్ప వారెవరూ తమ వ్యక్తిత్వం ఏర్పరచుకోవడానికి వేరొకరి వద్ద శిక్షణ తీసుకోలేదు. మనిషికి జీవితాన్ని మించిన గురువులేడు. మన పూర్వ తరాల చరిత్ర మన కోసమే నిక్షిప్తం చేయబడింది. దాని ద్వారా వారు జీవితాన్ని ఏవిధంగా స్వీకరించారో, ఏ రకంగా మలుచుకున్నారో మనకి అవగతం అవుతుంది. ఆయా సందర్భాల్లో వాళ్ళు చేసిన మంచిపనులు, ఆయా సంఘటనల్ని బట్టి వాళ్ళ

వేసిన తప్పటడుగులు అప్రయత్నంగానే మనకి స్ఫూర్తినందిస్తాయి. అనాదిగా మానవుడి అనుభవమే అతడికి పాఠాలు చెప్తోంది. మనిషికి అతడి అంతరాత్మని మించిన స్వానుభవ సందేశం లేదు. అతడు చేపట్టే ప్రతి కార్యక్రమం వెనుకా, అతడు సాగించే అన్ని కార్యకలాపాల్లోనూ అతడి పూర్వికుల నుంచి పొందిన ఆచరణాత్మకమయిన అసంకల్పిత జ్ఞానవే ఆంతరికంగా ఏది మంచో ఏది చెడో చెబుతూ అనుక్షణం అతడ్ని హెచ్చరిస్తుంటుంది. ప్రతీక్షణం మనిషిని పాలిస్తూనే వుంటుంది. మానవుడు ఉన్నతమైన సొంత వ్యక్తిత్వాన్ని ఏర్పర్చుకోవడానికి అతడికి అదే సహకరిస్తుంది. వైయక్తిక భావ సంపదే వ్యక్తిత్వంగా విరాజిల్లుతుంది. అయితే వ్యక్తిత్వమనేది సమిష్టి శ్రేయస్సు ఆధారంగా రూపొందేదే కానీ వేర్పాటువాదానికి దారి తీసేది కాదు. ముఖ్యంగా ఆస్తికత్వానికి భిన్నంగా ప్రతీ ఆలోచనాపరుడూ ఉన్నతమైన వ్యక్తిత్వానికి ప్రతీకలే అయ్యుంటారు. ఎందుకంటే అనుసరించేవాడు ఆలోచించడానికి అంగీకరించడు. అనాలోచనాపరుడికి స్వతంత్రమనే ప్రసక్తే లేదు. కాబట్టి సహజంగానే అనాలోచన అల్పత్వానికీ, అధమవాదానికీ లేదా అవివేకానికీ దారితీస్తుంది. ఇవన్నీ కూడా వివేకవంతమైన విజ్ఞానానికి విరుద్ధమైనవే కాబట్టి ఆలోచనాశీలికి మాత్రమే స్వీయ వ్యక్తిత్వమనేది వస్తుంది తప్ప అనాలోచనకెప్పుడూ సాంక్రమిత అజ్ఞానమే గతి.

నేను హైస్కూల్లో చదువుతుండగానో కాలేజీ రోజుల్లోనో నాకు సరిగా జ్ఞాపకం లేదు కానీ ఒక స్వచ్ఛంధ సంస్థ వివేకానందుడి పై వ్యాసరచన పోటీలు ఏర్పాటు చేసింది. వివేకానందుడ్ని అతడి వ్యక్తిత్వాన్ని నేనందులో వ్యంగ్యంగా విమర్శిస్తూ కరపత్రంలా వేసాను. ఇప్పడీ విషయాన్ని గుర్తుకు తెచ్చుకోవడం ఎందుకంటే, వ్యక్తులకి అలౌకిక లక్షణాలు అంటగట్టడం చరిత్రలో అడపాదడపా కనిపిస్తూనే వుంటుంది. మానవత్వ లక్షణాల్ని సరైన దిశలో పెట్టకపోయినా లేదా అత్యధిక మోతాదులో మానవత్వ ప్రహసనాన్ని ప్రదర్శించినా చరిత్ర అటువంటివారికి మానవాతీత లక్షణాల్నో మానవాధమ లక్షణాల్నో ముడిపెట్టక మానదు. అలాటి ఘట్టాలన్నీ వ్యక్తిపూజకే దారితీస్తాయి. వ్యక్తిత్వం పేరుతో యువజనులకి వృథా బోధనలు చేసే వృద్ధ వాదాలు యువతరం ఎదుటే తమ కండకావరాన్ని ప్రదర్శిస్తాయి. కిందటి సంవత్సరమో ఆ ముందటి సంవత్సరమో సరిగా గుర్తులేదు కానీ ఒక కమ్యూనిస్టు పార్టీ ఆహ్వానం మేరకు All India Democratic Youth Organization (అఖిల భారత ప్రజాస్వామ్య యువజన సమాఖ్య) మొట్టమొదటి యువజన సమావేశంలో నేనో ప్రతినిధిగా పాల్గొన్నాను. మూడురోజుల బాటు ఒడిస్సా రాజధాని భువనేశ్వర్‌లో ఇవి జరిగాయి. వాటిల్లో

అనేక ప్రశ్నలకి నాకు సమాధానాలు దొరకకపోయినా (బహుశా అది నా స్వభావ లోపమేమో!) నాతో బాటు పాల్గొనడానికి వచ్చిన వారిలో అనేక విషయాల్ని గురించి చర్చించే అవకాశం చిక్కింది. ఇప్పడీ ప్రస్తావన ఎందుకంటే అందులో అధికశాతం శూన్య మనస్తత్వాలే. మరి కొంతమంది అప్పడప్పడే సదాలోచనల స్వరూపాన్ని గ్రహిస్తున్నవాళ్ళు. నా భావపరంపర చూసి కాస్తంత అనుమానంగానే నన్ను చూడడం మొదటిపెట్టారు. అప్పటికే అనేక కమ్యూనిస్టుపార్టీలతీరు నాకు సుపరిచితమే అయినందువల్ల వాళ్ళ వైఖరిని నేను పెద్దగా పట్టించుకోకపోగా ఎప్పటిలాగే ఎదురయిన ప్రతి సంఘటన నుంచీ అందమైన నూతన అనుభవాన్ని మూటకట్టుకుని నా జ్ఞాపకాల దొంతరల్లో దాచుకోవడానికే ప్రయత్నించాను.

## వివాదాలు – వికారాలు !

వికృతానికెప్పుడూ కొత్తదనం ప్రదర్శించాలని వుంటుంది. విప్లవం అలా కాదు. దానికి నిర్దిష్టమయిన మార్గముంది. మూత పెట్టిన గతం నుంచి గుణపాఠాలు నేర్చుకోవాలని ప్రయత్నిస్తుందే తప్ప వైవిధ్యభరిత వికారాల కోసమో, వైరుధ్యం నిండిన వివాదాల కోసమో కొత్తదనాన్ని ఆశ్రయించదు. చరిత్రనేది సంఘటనల సమూహం. గత ఘటనల నుంచి గడించిన జ్ఞానాన్ని వర్తమానానికి అనుసంధించుకుంటూ, ఆ అనుభవసారాన్ని భవిషత్ రచనకు వుపయోగించడమే సరయిన చారిత్రక విధి. కొత్తదనమనేది చరిత్రకి యాదృచ్ఛికంగా మిళితమైయ్యేదే కాని, అలంకారికంగానో, అంగరంగవైభవంగానో దాని కృత్రిమ రంగులద్దినంతలో అది తన నిజస్వరూపాన్ని కోల్పోదు. చరిత్ర పరిణామాత్మకం. దానిది స్వీయ నూతనత్వమే కానీ ప్రయత్నం చేసి తెచ్చిపెట్టుకున్నది కాదు. అలాంటిదేదయినా అతికిస్తే అది చెత్తవుతుందే కాని చరిత్ర అవదు. చెత్తనే చరిత్రగా చదువుకునే బుర్రలకి అచరిత్రలన్నీ చరిత్రలుగా తోస్తాయి. అసలు చరిత్రని తెలుసుకోవాలనే తృష్ణకంటే కొత్త చెత్తని ఎంచుకోవాలన్న ఉష్ణమే వీరిలో అధికంగా వుంటుంది. అంతమాత్రంలో అచరిత్రలన్నీ చారిత్రక సత్యాలూకావు. చారిత్రక సత్యాలన్నీ అచరిత్ర చెత్తలూ కావు. చరిత్ర చరిత్రే, చెత్త చెత్తే. నూతనత్వపు గోల తలకెక్కిన ఒక తమాషా మిత్రుడు నా రచనల్లో నూతనత్వం లోపించిందని మరో మిత్రుడితో వాపోయా డట. నేను పైన వుదహరించిన ఉబుసుపోలు కొత్తదనం నా అక్షరాల్లో కొరవడిన మాట నిజమే. ఎందుకంటే నావి వ్యక్తిలో భావవికాసాన్ని ప్రేరేపించే రచనలే కానీ వ్యక్తిని బద్ధకస్తుణ్ణి చేసి పడుకోపెట్టేవయితే కాదు. నూతనత్వమనేది దుస్తులకే కాని నగ్న దేహాలకి పనికిరాదు కదా!

రోజుకోరకంగా మెలగడం మన నంగిరి మనస్తత్వాన్ని వ్యక్తపరుస్తుందే కానీ వ్యక్తిత్వ విధానాన్ని కాదు. ఎలా వుండడం విధానమో, అలా వుండకపోవడం వల్ల విధానలేమి, వ్యక్తిత్వలేమి మాత్రమే అవుతుంది. కానీ అలాకాక మరోలా అనాలోచితంగా, అనుసరించడం వల్ల స్వీయవికారం తెలెత్తుతుంది. విధానపరమైన ఆలోచనలు నిర్మాణాత్మక మార్పులకి దారితీస్తే, వికారపాలోచనలు విధ్వాంసానికి పురికొల్పుతాయి. మానవాతీత శక్తిని గురించిన ఆస్తికత్వ ఆలోచన ప్రమాదకరమైన ఆలోచనలకి ప్రారంభమైతే మతావిర్భావం మానవ పరిణామంలో విధ్వంసక ఘట్టం. మానవుడి మానసిక వికారం బహుశా మతంతోనే మొండి రూపం సంతరించుకుందేమో! అందుకు నిదర్శనంగా అనేక వికారాలు ఆచారాలపేరుతో, సాంప్రదాయంపేరుతో, సంస్కృతి పేరుతో ఈనాటికీ మానవాళిని పట్టిపీడిస్తున్నాయి. మానవుడు వైయక్తికంగా, విధానపరంగా ఎన్ని విప్లవాత్మక ఆవిష్కరణలు సాధించినా అతడి మానసిక పక్వత మతమనే వికారానికి పరిమితమైనంతవరకూ అనాగరికుడిగానే జమౌతాడు తప్ప నాగరికుడిగా పరిపక్వం పొందలేడు. అందుకే "This Would be the best of all possible worlds, if there were no religions in it" అంటాడు జాన్ ఆడమ్స్. మతాతీత ప్రపంచంలో మాత్రమే మనిషి మనిషిగా బ్రతకగలుగుతాడు. మత ప్రపంచంలో పశువుగా జీవిస్తాడనేదానికి ఈనాడు మనకి అనేక ఉదాహరణలు లభిస్తాయి. ఆదిమ దశనుండి దశలు దశలుగా మానవుడు విసర్జిస్తూ వచ్చిన పశుత్వాన్ని మధ్యలో వచ్చిన మతం మళ్ళా అతడికి ఆ అశుద్ధాన్ని అంటగట్టింది. ఆనాటి నుంచీ ఈనాటి వరకూ అతడు నాస్తికుడిగా, నిజమైన నవనాగరిక మానవుడిగా అడపాదడపా అశుద్ధాన్ని వదిలించుకోవడా నికి కొన్ని ప్రయత్నాలు చేసినా కూడా మతం మాత్రం అంటువ్యాధిలా అతడ్ని పట్టుకుని వదలడం లేదు. మనిషికి మతాన్ని మించిన మానసికజాడ్యం మరేమీ లేదు.

## నాస్తికత్వం – మానవత్వం !

నాస్తికత్వం నరుడి విధానం. మానవత్వం మనిషి బాధ్యత. మనిషిగా రూపుదిద్దుకునే ప్రయత్నంలో అర్ధమానవుడు లెక్కలేనన్ని పోరాటాలు చేయవలసివచ్చింది. వాటిల్లో దఫదఫాలుగా అతడు తన పశుత్వాన్ని విసర్జిస్తూనే వచ్చాడు. వైజ్ఞానికంగా వివిధ రీతుల్లో వికసించిన మానవుడి మానసిక పరిణితి అనూహ్యంగా అభివృద్ధి చెందనారంభించింది. అప్పుడప్పుడూ అతడిలోని పూర్వపు పశుత్వఛాయల ప్రభావం కనిపించినా మొత్తానికి

మానవత్వపు పోకడలే ఎక్కువగా వృద్ధిలోకివచ్చాయి. వ్యవస్థ నిర్మాణంలో ఒకరికొకరు సహకరించుకుని, అందర్నీ సమీకరించుకోవల్సిన అవసరం ఏర్పడింది. సామూహికంగా తప్ప సమాజం ముందుకుసాగదు. సమిష్టిగా సంఘాన్నిప్రస్థానం దిశగా నడిపించవలసిన ఆవశ్యకత ఎప్పుడైతే తలెత్తిందో అప్పుడే అందర్నీ పట్టించుకుని కార్యక్రమాలు చక్కబెట్టుకోవడం జరిగింది. సామాజిక ఉత్పత్తి క్రమంలో మనిషికి మానవత్వమనేది మామూలు అంశమైపోయింది. మొదట్లో ఆస్తికత్వపు విశ్వాసాలు మానవత్వపు విలువలపై ప్రత్యేకంగా ప్రభావవేమీ చూపించకపోయినా, మతమూ, రాజ్యమూ రెండూ మానవుడిలో అమానవత్వాన్నిప్రేరేపించే అమానుష నిర్ణయావిష్కరణలు అనేకం తీసుకున్నాయి. వాటిపై ఆధారపడి మతం వివిధ నూతన ఉన్మాదాల్ని ఊహాతీతబద్ధంగా మనిషిలో ప్రవేశపెట్టింది. ప్రాపంచిక కార్యకలాపాలకు, పాదార్థిక ఫలితాలకూ, పర్యావరణ పర్యవసానాలకూ అన్నింటికీ అతీంద్రియ, అలౌకిక ప్రతిపాదనల్నిప్రవేశపెట్టింది.

పాదార్థిక సత్యం గురించిన భావనలు అప్పటికింకా అసంపూర్ణంగానే అవతరించడమూ, ప్రాకృతిక సంఘటనల మధ్య కార్యకారణ సంబంధాలు గురించిన జ్ఞానం స్పష్టాతిస్పష్టంగా లేకపోవడమూ ఆనాటి మతానికి తాత్కాలిక తాత్విక బలాన్ని చేకూర్చింది. అయితే మతాన్ని, మతాధిపతుల్ని హడలగొట్టే మానవ వికాస ప్రయత్నాలు అప్పటికి బొత్తిగా లేకుండా పోలేదు. కానీ ఈనాడున్నంత బలంగా ఆనాడు లేవని తెలుస్తుంది. మానవ నాగరికత కొత్తగా నడక నేర్చిన నాటి నుంచి అనేక అవాంఛనీయ శక్తులతో అతడు సాగించిన సంఘర్షణల స్ఫూర్తి ముందు నవీన మానవుడి సంఘసంస్కరణోద్యమాలన్నీ కనుమరుగైపోతాయి. ఆనాడు అజ్ఞానానికి తలవొంచిన ఆదిమానవుడి అనాలోచనయిన భగవంతుడనే ఆస్తికత్వభావం అదెప్పటికైనా అపరిణిత చరిత్రగా మిగిలిపోక తప్పదు. అందుకే " To surrender to ignorance and call it god has always been premature, and it remains premature today." అంటాడు ఇస్సాక్ అసిమోవ్. అలౌకిక శక్తిని ఆరాధించడం ఆదిమానవుడు అనాలోచితంగా చేసాడు. ఆ తర్వాత వివేకవంతమైన మానవుడు సైతం ఆ దృష్టితోనే అతడ్ని అనుసరించాడు. అయితే గణనీయంగా కాకపోయినప్పటికీ ఆరంభం నుంచే ఆస్తికత్వానికి సమాంతరంగా నాస్తికులు కూడా బయలుదేరారు. ఆ కాలంలోనే అనేక తాత్విక చర్చలతో, తార్కిక ప్రశ్నలతో ఆస్తికుల ఆటలు కట్టించి, మతాధిపతుల నోళ్ళు మూయించారు. ఏ కాలంలోనైనా జ్ఞానులపై అజ్ఞానులు,

వివేకులపై అవివేకులు, ఆలోచనాపరులపై అనాలోచితులూ, స్వేచ్ఛాపిపాసులపై రక్తపిశాచులు, నాస్తికులపై ఆస్తికులు, మానవత్వవాదుల పై మతవాదులు దాడి చేయక తప్పదని చరిత్ర చెబుతోంది. ఆ కోవలోనే వారందరూ విగలజీవులై వుండాలి. వారికి సంబంధించిన సాహిత్యమూ, చరిత్ర కూడా అలాగే చెరిగిపోయియుండాలి. సత్యాన్వేషకులపై దుష్టుల తీరు ఎప్పుడూ ఇలాగే వుంటుందేమో.

## నవ్యనాస్తికత్వం – నయా నియంతృత్వం !

భావవికాసానికి ఆలోచింపజేయటమే ప్రధానం కానీ బలవంతంగా భావాల్ని రుద్ధడం కాదు. నియంతృత్వం మతతత్వమౌతుందే కానీ మానవత్వంగా మారలేదు. అంటే నాస్తికత్వం నియంతృత్వానికి బద్ద వ్యతిరేకమన్నమాట. నాస్తికత్వం భావసంస్కరణతో సరిబుచ్చుకుని సెలవుతీసుకోదు. నాస్తికత్వం ఒక జీవన విధానం. మనిషి నైతికంగా, ఆలోచనాత్మకంగా వున్నతుడు కావడానికి అవసరమైన సశాస్త్రీయ వివేచనా వైఖరిని అవలంభించేందుకు అది తోడ్పాటునందిస్తుంది. తద్వారా మానవ మనుగడ క్రమంలో వ్యక్తిగతస్వార్ధాన్ని క్రమబద్దీకరించి సామాజిక ప్రగతికి దోహదం చేస్తుంది. దేవుడు లేడని ఈనాటి నాస్తికులు కొత్తగా కనిపెట్టిన విషయం కాదు. అనాదిగా మానవుడు ఆచరణలో నాస్తికుడే, ఒకానొక బలహీన క్షణంలో అతీంద్రియ అస్తిత్వాన్ని అతడు తన స్మృతిపథంలో సృష్టించుకుని వుండవచ్చు. అంతమాత్రంలో అతడు తన క్రియాశీల ప్రక్రియల్ని, ఆంతరిక ఆలోచనా పరిణామాన్ని ఆపుకోలేదు. అంటే భగవంతుడనే భావన అతడిని కొంత ఏమార్చగలిగిందే కాని భౌతికంగా బద్ధకస్తున్ని చేయడానికీ, బౌద్ధికంగా బానిసని చేయడానికిగానీ పనికిరాలేదన్నమాట. అయితే ఆరంభంలో అంతంత మాత్రంగానే వున్న పరలోక భావన అంతిమంగా మతం రూపం ధరించేటప్పటికి మాత్రం అమానవత్వానికి దారితీసింది. అప్పటిదాకా లౌకిక సమస్యలకి మాత్రమే పరిమితమయిన మానవుడ్ని అలౌకిక అపభ్రంశాలతో ఉక్కిరిబిక్కిరి చేసింది. మనిషిపై మానసిక నియంతృత్వాన్నిప్రదర్శించింది. అందుకే “God himself has no right to be a tyrant” (దేవుడిక్కూడా నియంతలా మెలిగే హక్కు లేదు ) అంటాడు - గోడ్విన్ మహాశయుడు.

వ్యవస్థలో కొందరిది బహిరంగ కులమత గజ్జయితే మరికొందరిది అంతర్గత రొచ్చు. రెండూ పైత్యం ప్రమాదకరస్థాయిలో ప్రకోపించడం వల్ల పుట్టినవే. ఇవి సమాజంలో నిత్యం దర్శనమిచ్చేవే. ఇదేమీ రహస్యం కాదు. వ్యక్తిగతంగా నా స్నేహితుల్లో కూడా కొంతమంది

పాపం ఈ వ్యాధి పీడితులే. కొద్దో గొప్పో మారాలనే కోరిక కారణంగా నలుగురిలో నిలకడ వహిస్తారు. మనిషి స్వతహాగా నిరంతరం పరిణితి చెందే స్వభావం కలవాడే. కానీ అతడందుకు మానసికంగా సిద్ధపడకుండా ఆలోచనల్ని బలవంతంగా నియంత్రించ ప్రయత్నించడం వల్ల అతడి అంతరంగిక వికాసం అప్రయత్నంగానే కుంటుపడకతప్పడం లేదు. అనేక రకాల కుహనా కుటిల తత్వాల నడుమ నిజమైన నరుడి మార్గాన్ని ఎంచుకుని పయనించడం కాస్త క్లిష్టమైన పనే అయినప్పటికీ మానవుడి అంతరిక స్మృతి అతడ్నెప్పుడూ సరైన పథంలో సాగనంప డానికే ప్రయత్నిస్తుంది. సాంఘిక పరిణామంలో, సామాజిక కాలగమనంలో ఆటుపోట్లనేవి ఎదురయినప్పటికీ మొత్తానికి మానవుడి ప్రస్థానం ముందుకే సాగుతుంది. అఖండమయిన ఆత్మవిశ్వాసమే ఎప్పటికయినా అతడికి అండగా నిలుస్తుంది. అనేక సంక్షోభ సమస్యల నుంచీ, వివిధ వైరుధ్యపు వివాదాల్లో నుంచీ బయటపడడానికి అదే అతడికి తోడ్పడుతుంది. మనిషికి మానసిక స్థైర్యం అతడి ఆలోచనల్లోని పటిష్టత్వం ద్వారా మాత్రమే ఏర్పడుతుంది తప్ప అది ఎంచుకుని తెచ్చుకునే ఎరువు సరుకో, పంచుకుని తీసుకునే అరువు మురికో కాదు. వ్యక్తి తనంతట తాను ఏర్పర్చుకునేది వ్యక్తిత్వం అవుతుంది తప్ప ఎరువు తత్వాలన్నింటినీ రంగరించుకుని రంగు మొహంతో ప్రదర్శించేది వెధవాయిత్వమే. వెధవాయిత్వాన్ని వ్యక్తిత్వంగా భ్రమించడం మూర్ఖత్వమవుతుంది. మోతాదు మించిన మూర్ఖత్వం ఉన్మాదానికి దారితీస్తుంది. ఉగ్రోన్మాదం పిచ్చస్థితికో, నీచస్థితికో వ్యక్తిని దిగజారుస్తుంది. కుల కట్టుబాట్లూ, మత సాంప్రదాయాలు చివరికి దారితీసేది అక్కడికే. అందుకే కులమతాల్నిమించిన కుళ్ళుని సమాజంలో వెతకడం వ్యర్థం. సత్యాన్వేషణ స్వీయ తృష్ణే తప్ప దానికేమీ సంప్రదాయం లేదు. దేనిమీదా ప్రత్యేకమయిన పక్షపాతమూ లేదు. వ్యక్తిగతంగా చెప్పాల్సి వస్తే, ఏ మతం మీదా నాకు ప్రత్యేక శత్రుత్వం లేదు. ఏ మతాధిపతితోనూ నాకు వ్యక్తిగత వైరం లేదు. అలాగని విధానపరమైన విభేధాలని నేనన్నడూ వుపేక్షించి వదలలేదు. సనాతన ధర్మం పేరుతో పురాతన పిచ్చిని ప్రదర్శించినా, పవిత్ర గ్రంథమని చెబుతూ పాత చెత్తని ప్రార్థనా రూపంలో ప్రతిపాదించినా, సర్వశక్తిమంతుడూ, అనంత కరుణామయుడంటూ వెనకటి వెర్రినే సురాల స్వరాల్లో వినిపించినా అవన్నీ మతస్తులుగా మన మానవత్వాలకయితే మట్టుకు మచ్చుతునకలు కావు. ఆస్తికత్వమనేది మానవుడి ఆదిమ పశుత్వాన్ని ప్రతిష్టించేదే తప్ప మనిషిని ఉన్నతుడిగా నిలబెట్టేది కాదు. అన్వేషణకి అంతం అంటూ ఉండదు. అది నిరంతర ప్రక్రియ. సత్యం కోసం. జ్ఞానం గురించి అది సాగుతూనే ఉంటుంది తప్ప తృప్తి పొంది చతికిలపడదు. అందుకే

సత్యాన్వేషకుల్ని నమ్ము, సత్యాన్ని కనుగొన్నాననేవారిని కాదు. " Believe those who are seeking the truth. Doubt those who find it " అంటాడు ఆండ్రోగిడ్. నిజాన్ని తెలుసుకోవడానికి పెద్దగా కష్టపడనక్కరలేదు, అబద్ధం గురించిన అభిప్రాయాలు తొలగించుకోవడానికి ప్రయత్నిస్తే చాలు. అపశ్రంశపు భ్రాంతులు మనిషిలో చాలా బలంగా నాటుకున్నాయి. అవి తొలగించు కుంటే అసలు నిజం మనిషి స్మృతికి స్ఫురించడానికి అట్టే సమయం పట్టదు.

## నాస్తిక నగారా !

ఇవి నవ్వాక్షరాలు కాదు. ఒక నాస్తికుడి నగ్నాక్షరాలు. నరాల్లోంచొచ్చిన భగ్నాక్షరాలు.

బట్టలిప్పి చూసుకోండొక్కసారి మీ బతుకులకి పట్టిన బురదని, దుస్తులిప్పి పరిశీలించుకోం డొక్కసారి మీ దైనందిన జీవితాలకి పట్టిన దురదని. మనస్ఫూర్తిగా మననం చేసుకోండొక్కసారి మీ మనసులకి అంటిన మాలిన్యాన్ని, అనచ్ఛాధితులై ఆస్వాదించుకోండి మీ ఆలోచనలకీ, అనుభవాలకీ అంటుకొనున్న అశుద్ధాన్ని. వున్నంత కాలమూ ఊడిగం చేయకుండా ఉన్నతంగా ఉండలేకా, శరీరంలో శక్తున్నా సరే చేతులు కట్టుకోకుండా పనిచేయలేకా, తల వున్నంత వరకూ తలెత్తుకు తిరగలేకా, బతికినంత కాలం బానిసల్లా తప్ప మనుషుల్లా మసల్లేకా, పోయే వరకూ పక్కవాడి పొట్ట కొట్టకుండా వుండలేకా కొట్టుమిట్టాడుతున్నారు. ఆది నుంచి విధిని నమ్ముకున్న మీ వెర్రుల్లో, అనంతమయిన పనికిమాలిన అజ్ఞానాన్నే అపారమయిన పరమ పవిత్ర విజ్ఞానంగా భ్రమిస్తున్న మీ బుర్రల్లో, పుట్టిన దగ్గర్నుంచీ ప్రతిరోజూ చావుకి జడుస్తూ శృంగారానికీ, పొర్లడానికీ కూడా తేడా తెలీని తెగులు సృజనాత్మకతతో ముక్తి పేరుతో, మోక్షం పేరుతో మృత్యువు వరకూ మిమ్మల్ని మీరే వెధవల్చేకుంటున్నారు. అనేక తరాల నుండి అనవసర అణుకువలకి అలవాటుపడ్డ మీ మొద్దుబారిన మెదళ్ళనీ, వంశపారంపర్యంగా ఈ వ్యవస్థతో వ్యభిచరించడానికి అలవాటు పడ్డ మీ నీచమైన వ్యక్తిత్వాల్ని, ఎప్పుడో చచ్చిపోయి కంపుకొడు తున్న మీ మృతదేహాల్లోని ఒద్దికయినా హృదయాల్నీ ఇప్పటికయినా స్వేచ్ఛగా వదిలేయండి. శతాబ్దాల్నించీ కుళ్ళిపోయిన మీ సాంప్రదాయిక శరీరాల్తో ఈ సమాజంతో కుతి తీర్చుకుంటూ, మనసులో మీకు నచ్చిన వ్యక్తిని వూహించుకుంటూ, మంచం మీద మీకందిన దాన్తో దాస్యపు దత్తి తీర్చుకునే మీ కుహనా కక్కుర్తి నపుంశక నటనల్ని ఇకనయినా నిర్మలంగా నిర్మూలించుకో వడానికి నిజంగా ఒక్కసారైనా ప్రయత్నించండి. నిద్రలో నీలిచిత్రాల బూతుబొమ్మల్ని గుర్తుకు

తెచ్చుకున్నప్పుడు అయిన స్వప్నస్కలనంతో సంతోషించినట్లుగానో, ఆపుకోలేని హస్తప్రయోగపు ఆఖరిదశలో అలౌకికమయిన ఆనందాన్ని అనుభవించినట్లుగానో ఈ అక్షరాల్ని అలుసుగా చదివి అయిందనిపించి నా కలాన్ని కలుషితం చేయకండి. ప్రయత్నాన్ని అపవిత్రం చేయకండి. కర్రగా మిగిలిపోయేకంటే కట్టెగా కాలి బూడిదవ్వాలనుకున్నప్పుడే, బద్ధమై బతికేకన్నా బాధ్యతగా అంతమైపోవడమే మంచిదనుకుంటేనే, మంచులా కరిగిపోయేకంటే మనిషిగా మండి మాడి మసయిపోదామనుకున్నప్పుడే, ఒకరికి ఒదిగి ఎదిగేకన్నా ప్రపంచంతోనైనా పోరాడి ఓడిపోవడానికే మీరు సిద్ధంగా ఉంటే అప్పుడు మళ్ళీ మొదలుపెట్టి చదవండీ పుస్తకాన్ని. స్థితికి శాశ్వతంగా అక్షరాల్తో దహన సంస్కారం చేస్తూ, అవే అక్షరాలను గతికి అంకితం చేస్తూ వర్తమాన సమాజ జీవన స్వరూపాన్ని సమూలంగా మార్చివేసే మహోన్నతమైనొక వ్యవస్థ మహత్తరమైన ఈ కాలగమనంలో మానవాళి కోసం నిరీక్షిస్తోందన్న నిజాన్ని నిస్సంకోచంగా, నిస్సందేహంగా నమ్ముతూ ... సెలవు !

'సముద్రం ఒకడి కాళ్ళ దగ్గర కూర్చొని మొరగదు
తుఫాను గొంతు చిత్తం అనడం ఎరగదు
పర్వతం ఎవడికీ వంగి సలాం చెయ్యదు
నేనింతా ఒక పిడికెడు మట్టే కావొచ్చు
కానీ కలమెత్తితే నాకు ఒక దేశపు జెండాకున్నంత పొగరుంది.'

- శేషేంద్ర

నిజానికి నమ్మేవారితో నిమిత్తం లేదు. అబద్ధానికి అంగీకరించిన వారితో అనుభందమూ లేదు. మనుషులుగా ఏది నిజమో - ఏది అబద్ధమో, ఎలా నిజమో - ఎలా అబద్ధమో, ఎందుకు నిజమో - ఎందుకు అబద్ధమో, ఎప్పుడు నిజమో - ఎప్పుడు అబద్ధమో, బేరీజు వేయలేని మన వివేకం వృధా.

మతాలకి ప్రత్యామ్నాయంగా మార్క్సిజాలు, మానవవాదాలు బయలుదేరి మనిషి స్వేచ్ఛకు సమాధి కట్టాయి. మతాధిపతులకు పోటీగా నాస్తిక, హేతువాద శిఖామణులు సైతం కొలువుదీరి తమ దుకాణాల అమ్మకాలు పెంచుకుంటున్నారు. అసలనేది లేని వీరంతా కొసరుకి కొమ్ము కాస్తున్నవారే.

అధ్యయన రచనలు కూడా ఆచరణలో భాగమేనని ఊగేవారూ, ఆచరణతో సంబంధం లేని అధ్యయనాలు, అక్షర వ్యాసాంగాలు ఎందుకని పేలేవారు, ఇరువురూ ఇరుకునే సరుకుగా భావిస్తూ నిజాలకు భయపడి బెరుకుగా జీవిస్తున్నారు. ఆంతరిక అల్పత్వం స్వతహాగా వీరి సైద్ధాంతిక లోపం.

మనం జీవిస్తున్నామని దృవవరిచే కొండగుర్తులని మొండిగా తగిలించుకుని బండిలా ముందుకు సాగుతూ, పుట్టిన కులానికి కట్టుబడి, చెప్పిన మతానికి ఇష్టపడి, తోచిన వృత్తికి బోర్లాపడి, దొరకిన బాంధవ్యాలకు బాకీపడి, సంఘానికి సాక్షాత్కారవడడవే సగటు జీవి జీవితంగా ఎంచబడుతోంది.

సత్యం పేరుతో నచ్చిన తత్వాన్ని నెత్తికెక్కించుకుంటూ, జ్ఞానమంటూ మెచ్చిన తర్కాన్ని తలకి రుద్దుకుంటూ, మన చాంచల్యాన్ని చాటుకునే స్వేచ్ఛ మనకున్నట్లే, ఎదుటివారి చిత్తాన్ని సైతం ఆహ్వానించాలనే వైచిత్యాన్ని మరచి, మనకు నచ్చిందే నందని - మనం మెచ్చిందే పందని పరవశించడం కద్దు.

ఏది నిజమో ఏది కాదో నిజాలను బట్టి కాక ఇజాలను చదివి తెలుసుకోవాలనుకోవడం బుద్ధి జీవుల దౌర్భాగ్యమైతే, అది ఎలా నిజమో ఎందుకు నిజమో తమ బుద్ధిని బట్టి కాక, బుద్ధి లేమి జీవులని అనుసరించి తెలుసుకోవాలనుకోవడం సామాన్య జనాల సాంప్రదాయక జాఢ్యం.

జ్ఞానం పై గుత్తాధిపత్యానికి మేధస్సనేది ఏ ఒక్కరి సొత్తూ కాదు, కాబోదు!